# భావవీణ



రచయిత:

కలవకొలను సూర్యనారాయణ, B.A.,

ప్రథమ ముద్రణ ; 1999

ప్రతులు ; 500



వెల ; అమూల్యము

ప్రతులు లభించుచోటు ;

కలువకొలను సూర్యనారాయణ
ప్లాటు నెం. 58
సీతారామ్‌నగర్ యన్.జి.ఓ. కాలని
శ్యామలానగరు వెనుక
గుంటూరు-6.

ముద్రణ ;

శ్రీ ద్వారకాసాయి ప్రింటర్స్, ఏ.టి. అగ్రహారం, గుంటూరు.

డాక్టర్ ప్రసాదరాయకులపతి
Rtd Principal, Hindu College
శ్రీనాథ పీఠ నిర్వహణాధ్యక్షులు,
గుంటూరు

శ్రీ కలవకొలను సూర్యనారాయణగారు చిరకాలము ప్రభుత్వో ద్యోగముచేసి ఇటీవల విరమణపొంది విశ్రాంతి కాలమును సాహిత్య సాంస్కృతిక వ్యాసంగములో గడుపుచున్నారు. వృత్తికి ప్రవృత్తికిగల భిన్నస్థితినిదాటి స్వేచ్ఛగా భావ వ్యక్తీకరణచేయగలప్రశాంత దశలో వారికి సాహిత్య సృష్టి ప్రారంభమైనది. వాసనా రూపమను బీజము జీవుని మనః క్షేత్రములో లేనిచో ఏ రసభావమును మొలకెత్తదను ఆలంకారిక సిద్ధాంతమననుసరించియిన్ని యేండ్లుగా నిక్షిప్తమైన కవితా బీజమిప్పుడంకురితమై కోరకితమై కుసుమితమై ఫలితమై మధుర రసమును అందించు చున్నది.

వీరి శ్రీనివాస కళ్యాణము భక్తిభావుక రచన రసజ్ఞుల మన్న నల నందినది. ఇప్పుడుదయించిన భావవీణ రమణీయ నిక్వాణ తరంగముల వెలువరించు చున్నది. ఈ ఖండ కావ్య సంపుటిలో వారి హృదయమును స్పృదింపజేసిన అంశములెన్నో చోటుచేసి కొన్నవి. దరిద్రుడైన ద్రోణుని చిన్ననాటి స్నేహితుడని అంగీక రించుట కిష్టపడక అవమానించిన ద్రుపదునిపై రేగిన బాధాభరిత క్రోధ స్వరూపము కవితా రూపముదాల్చిన తీరు అనుభూతి జనిత మైన సాహితి నికిదర్శనము.

అటులే విశ్వయోగి విశ్వంజీ మానవతావాదము, ప్రేమ తత్వము, సేవాతత్పరత రచయిత నెంతగానో ఆకర్షించి హృద్య పద్య నిర్మాణము చేయించినవి. అదేవిధముగా విశ్వమానవ సేవలో తరించిన మదర్ థెరిస్సా కవితా నీరాజనము నందుకొన్నది. అవినీతితో, అక్రమాలతో, అన్యాయాలతో నిండిన సమాజాన్నిచూచి బాధపడుతున్న భారతాంబను సంబోధిస్తూ వ్రాసిన పద్యాలు అధునాతన సంఘ పరిస్థితులకు దర్పణంగా భాసిస్తున్నవి.

శ్రావణహేల, సంక్రాంతి, భావవీచిక-ప్రకృతి కవిత కుదాహరణలు. సౌమిత్రి, దశరధ నిర్యాణము-రామాయణ కథా ప్రభావ భావితములు. వరూధిని పైవచ్చిన పద్యాలు మనుచరిత్రఅధ్యయన ఫలాలు. కాకుంటే ఆధునికులు చాలమంది ప్రవరుని విమర్శించినారు. వీరటులు చేయలేదు. ఇక వీరనీరాజనము-భారత సైనికులపై ఉదయించిన కవిత. ఇది రచయితల కర్తవ్యము. యుద్ధవీరుల శౌర్య త్యాగాలకు స్పందింపక పోయిన కవి యెందుకు ?

ఈవిధముగా సరళశైలి, ధారాళమైన ధోరణి, ప్రసన్నభావుకత వీరి కవితకు లక్షణాలు. ఇంత మంచి కావ్యము రచించిన వీరిని అభినందించుచు మరిన్ని రచనలు చేయవలెనని కోరుచు పాఠక లోకము ఈ గ్రంథమును సమాదరించగలదని ఆశించుచున్నాను.

# ఆనందసాగరం

"సరససాహితీ చరణ చారణ చక్రవర్తి"
జి.వి.యల్.యన్. విద్యాసాగరశర్మ, M.A.,
(రిటైర్డు ప్రభుత్వ డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్)
గుంటూరు.

"సహజ కవితావతంసు"లైన శ్రీ కలవకొలను సూర్యనారాయణగారి అమృతలేఖిని నుండి జాలువారిన మరో మధుర బిందువు ఈ "భావవీణ"

ఇతఃపూర్వం శ్రీ సూర్యనారాయణగారు సాయినాథసుధామాధురి మొదలైన చాలా కావ్యఖండికల్ని వెలువరించి, ఇప్పుడీ భావవీణపై జిలిబిలి స్వరాలు పలికించి సాహిత్య జగత్తును పరవశింపజేస్తున్నాడు

వృత్తిపరంగా ఈయన జిల్లాపంచాయతీ కార్యాలయములో సూపరెంటెండెంట్‌గా పనిచేసి రిటైరైనా, ప్రవృత్తిపరంగా అవిశ్రాంతంగా ఇప్పటి వరకు కవితా వ్యవసాయం కొనసాగిస్తూనే ఉన్నారు. ఇది అభినందించవలసిన విషయం.

"పద్యకవితకు కాలం చెల్లిం"దని కొంతమంది తలపోస్తున్న ఈ క్రీవర్సుయుగంలో "అట్లా భావించటం చాలా తప్పు. కవిత్వాన్ని ఏరూపంలోనైనా పలుకవచ్చు"నని తమ పద్య కవితద్వారా

లోకానికి చాటుతున్న ఈ సూర్యనారాయణగారి ధైర్యసాహసాల్ని ప్రశంసించకుండా ఉండలేకపోతున్నాను.

ఈ భావవీణలో సాంత్వనం, కుంతీహృదయం, విశ్వయోగి, నిరీక్షణం, అశ్రునివాళి, మౌనరాగం, శ్రావణహేల, భగ్నమానస, సంక్రాంతి, భావవీచిక, సౌమిత్రి, దశరథ నిర్యాణం, విరహిణి, వీరనీరాజనం అనే పదునాల్గు ఖండికలు ఉన్నాయి.

ముఖేముఖే సరస్వతి. చిన్నపిల్లల యొక్క పలుకులు వింటున్నప్పుడు మన హృదయంపై కలికి పన్నీటిసోన కురిసినట్లనిపించి పరవశించిపోతాం. "ఆహా !" అని మనల్ని మనమే మరచిపోతాం. మహావక్తల మహోపన్యాసాలు విన్నప్పుడు "ఓహో" అని మెచ్చుకుంటాంగాని, చిన్నపిల్లల మాటలు విన్నప్పుడు కలిగిన మధురానుభూతిలాంటి అనుభూతి మచ్చుకక్కడా కలగదు.

ఈ భావవీణ మహాకావ్యం అనీ, ఈ సూర్యనారాయణగారు మహాకవి అనీ నేను ప్రశంసాపత్రం ఇవ్వబోవటంలేదు. కానీ, మహాకవి కావటానికి అనువైన మార్గాన్ని మాత్రం జాగ్రత్తగా వేసుకుంటున్నాడనీ, కవితా తపస్సు కొనసాగిస్తున్నాడనీ, నిరంతర సాధనవల్ల అచిరకాలంలో సిద్ధార్థుడుకాగలడనీ విశ్వసిస్తున్నాను.

ఈ లఘుకృతిలో పూర్వకావ్యాలలోని కొన్ని తళుకులు అక్కడక్కడా కనిపిస్తూ మన కళ్ళని జిగేల్మనిపిస్తాయి. సంక్రాంతి ఆగమనాన్ని వర్ణిస్తూ "నెలవంక నెదిరించు నెమ్మోముపై పండు

మిరపల తిలకంబు సరిగదిద్ది" (31వ పేజి) అని చెప్పిన పద్యం ఒక్కటి చాలు ! సూర్యనారాయణగారి వర్ణనానైపుణ్యం ఎలాంటిదో ఉపహరించటానికి.

కరుణశ్రీగారు పుష్పవిలాపం వెలువరించినట్లు ఈ కవికూడా తరువిలాపంగా, కరుణాకలితంగా "మౌనరాగం" వెలువరించాడు.

"మాటలురాని మూగలము-మారు వచింపగలేనివార-మె
చ్చోటకుపోన శక్తులము - శోకము మౌనముతో భరించి, క
న్నీటి కణాలు రాల్చి, అవనిన్ బడప్రాణము చెల్లిపోవు-మీ
ఘాటికి హద్దు లేదె ? మమతల్ మదిలేవె ? దయావిహీనులే ??
ఈ మొదలైన పద్యాలు వింటున్నప్పుడు మన గుండెలు చెమ్మగిల్లుతాయి.

మరింత ఓపిగ్గా, కాస్త శ్రద్ధగా కవితాతపస్సుచేస్తే శ్రీసూర్యనారాయణగారు సాహితీజగత్తులో తమ స్థానాన్ని సుప్రతిష్ఠం చేసుకోగలరని ఆశిస్తున్నాను.

ప్రస్తుత సామాజిక స్థితిగతులకుకవిహృదయం ఎలాస్పందించి లోకాన్ని జాగృతం చేస్తుందో ! చెప్పటానికి వీరి "వీరనీరాజనం" అనే ఖండిక ప్రబల సాక్ష్యం.

"ఆకాశంబును తాకు కొండగమిపై, నత్యంత ధైర్యాతిబుతో
రాకాసుల్ బలెనొప్పు శాత్రవులతో రక్తంబు చిందన్ భళీ !
"సాకారంబగు రుద్రులో !" యన నొడల్ ఝుల్ ఝుల్లనన్,
మంచులో

వీకన్‌హోరు సిపాయిలార ! కొనుడీ వేవేలు జోహారులన్

అని ఈ కృతి అంతలో వీరు పలికిన జేజేలు నూరుకోట్ల భారతీయులకు పట్టిన నీరాజనాన్ని ప్రతిధ్వనిస్తుంది.

ఈ ఖండకావ్యం యావత్తూ ఒక తియ్యని బొండుమల్లెల పూల పొట్లమయితే-ఆ పొట్లం విప్పి, "ఇదిగో ! ఈ పువ్వు ఎంత పరిమళంగా ఉందో ! చూడండి." అని ఎన్ని పూలను ఎత్తి చూపను. ఎంతగా ప్రశంసించను ? సరస సాహితీ సుసంగతుల్ని మీరే స్వయంగా ఈ భావవీణను మీటి ఆ స్వరాల పరువాల మరందాన్ని తనివిదీరా కుత్తుకబంటి గ్రోలం" డని సవినయంగా ప్రార్థిస్తున్నాను.

ఈ గ్రంథం సరసహృదయ సదయ సారస్వతేయులందరికీ సమాదరపాత్రం కాగలదని విశ్వసిస్తున్నాను.

శ్రీ సూర్యనారాయణగారు అచిరకాలంలో మరింతగా కవి యశస్సు నార్జించి, మరిన్ని కావ్యాలను వెలువరించాలని ఆనంద సాగరుణ్ణై హృదయపూర్వకంగా అకాంక్షిస్తున్నాను. అస్తు !

శుభం భూయాత్ ! !

# ఆశంస



సాంత్వనము, కుంతీ హృదయము, విశ్వయోగి, నిరీక్షణము అశ్రునివాళి మౌనరాగము, శ్రావణహేల, భగ్నమానస, సంక్రాంతి భావవీచిక, సౌమిత్రి, దశరథ నిర్యాణము, విరహిణి, నీరాజనముల నెడి పదునాల్గు శీర్షికలుగల చిన్న పొత్తమిది. ఈ చిఱు పొత్తపు రచయిత శ్రీ కలవకొలను సూర్యనారాయణగారు, వృత్తిరీత్యా పంచాయితీరాజ్ శాఖలో ఉద్యోగియైనను, ప్రవృత్తిరీత్యా, మంచి సాహితీ పిపాసి. చక్కని భావుకుడు. వీరి ఇంటిపేరు పొరపాటున "కలవకొలను" అని వాడుకలో నున్నది. కాని అది "కలువకొలను" (కలువలుగల కొలను) అని మా అభిప్రాయము. అప్పుడప్పుడు వీరికి కలిగిన తత్కాల భావనలకు రూపొసగిన పద్యరూప ప్రకటనమే ఈ గ్రంథము. కావున ఈ గ్రంథమునకు "భావవీణ" అనుపేరు సముచితముగ నున్నది.

చిన్నవి, పెద్దవి కలిసి ఇందు మొత్తము 171 పద్యము లున్నవి. పద్యము లన్నియు సులభ శైలిలో, సరళ సుందరముగ, రచియింపబడినవి. ఆంగ్లకవి టెన్నిసన్ మహాశయుడు నుడివినట్లు పెద్ద భావములను, చిన్న చిన్న మాటలలో, చిన్న చిన్న పద్యము

లలో వ్రాయుట చాల కష్టము. ఆ కష్టతరమైన కళయందు శ్రీ సూర్యనారాయణగారు నిష్ణాతులు.

ఇందలి పద్యములు కొన్ని ప్రాచీన కవుల పద్యములను స్ఫురింప జేయుచున్నవి. ఉదాహరణమునకు 5వ పుటయందు, ధారుణి రాజపుంగవుల".... అను పద్యము, నన్నయగారి "ధారుణి రాజ్య సంపద మదంబున.... "అను పద్యమును 6వ పుటయందు" ఏమి తపంబు జేసెనొకొ.... " అను పద్యము పోతనగారి "ఏమి తపంబు జేసెనొకొ ? యీ ధరణీ దివిజోత్తముండు ... " అను పద్యమును, అట్లే 7వపుటయందు "నాకొడుకుల్ మహాధ్వరమునన్" అనునది తెనాలిరామకృష్ణుని "నాదు సహోదరుండు సుజనస్తవ నీయ.... '' అను పద్యమును స్ఫురణకు తెచ్చుచున్నవి కేవలము, ఈ కారణముగ, ఈ కవి ఆమహాకవులను గ్రుడ్డిగా అనుకరించెనను కొనుట ధర్మముకాదు. ఆ మహాకవుల కావ్యములను పలుమార్లు చదివి వానిని తనలో అణువణువున జీర్ణించుకొని, వాని నీయన తన సొంతము కావించు కొనియెనని మాయభిప్రాయము. ఇది కడుంగడు ప్రశంసార్హమైన కార్యమని మాభావన.

ఇటులనే "మౌనరాగము'' అను శీర్షిక క్రింద వ్రాసిన పద్యములు కొన్ని జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి పద్యములను జ్ఞప్తికి తెచ్చుచున్నవి.

ఇక "నీరాజనము" అను శీర్షిక క్రింద వ్రాసిన పద్యములు ఈ గ్రంథాంత మందున్నప్పటికీ, ఆంగ్ల భాషలో "Though last, not least" అను చందముగ ఈ గ్రంథములోని పద్యములన్నింటి కిని, అగ్రేసరములై యలరారు చున్నవి. దీనికి కారణము - అందలి అంశము మహోత్కృష్టమైనది. ఎంతయో దేశభక్తితో పరవశమై ఇటీవల సంభవించిన "కార్గిల్ విజయోత్సవము"పై వ్రాసిన పద్యములు కదా అవి.

ఇట్టి గ్రంథముల నితోధికముగ భావి కాలమందు వ్రాయుటకు వీరికి ఆశేషగిరి వాసుడగు సర్వేశ్వరుడు, శక్తియుక్తుల ప్రసాదించు గాత. ఇతిశం.

ఇట్లు

రాజమహేంద్రవరము

శేషగిరి - సర్వేశ్వర కవులు

31-7 99

(సత్యవోలు శేషగిరిరావు
&
పంగపండు సర్వేశ్వరరావు)

# అంత (ర్) రాగం

తంత్రులు మీటితే వీణ మధుర రాగాలు పలుకుతుంది. కర్ణ పేయంగా ఉంటుంది. ఆనంద సాగరంలో నోలలాడెదము. హృదయవీణ మీటితే రసమయ భావ తరంగాలు వెలువడును ఆ భావాలు అక్షరాకృతినిబొంది కావ్యరూపం సంతరించుకుంటుంది. అవిథంగా ఆకృతి గొన్నదే ఈ చిఱు కావ్యం "భావవీణ" అనే ఖండ కావ్యం.

నా వయస్సు చతుష్షష్ట్యబ్దములైనను, నాలోని కవితా కన్యకు షడబ్దములు మాత్రమే. బుడిబుడి నడకలతో ఇప్పుడిప్పుడే బయట ప్రపంచంలోనికి అడుగులిడుచున్నది. వడివడిగా నడిచే రోజెప్పుడు వస్తుందో........

ఈ ఖండ కావ్యమును ఆ మూల చూడము చదివి పరిశీలించి పీఠకలను వ్రాసిన మాన్యులు, కవిబంధువు, సాహితీ సింధువు, బ్రాహ్మీ మానస పుత్రులు డా॥ ప్రసాదరాయ కులపతి గారికి, శ్రీ జి. వి. యల్. యన్. విద్యాసాగరశర్మ గార్కి, శ్రీ శేషగిరి సర్వేశ్వర కవులకు నా హృదయ పూర్వక నమస్సుమాంజలుల నర్పిస్తున్నాను. వారి ఆశీస్సులే నా కవితా కన్యకు మంగళకర కర్పూర హారతులు.

కావ్య ముద్రణకు ధన సహాయము నందించిన మిత్రులకు అందముగా అచ్చువేసిన ద్వారకాసాయి ప్రింటర్స్‌వారికి. ముఖచిత్ర మును తీర్చిదిద్దిన శ్రీ భగవాన్‌దాస్ గారికి నాకృతజ్ఞతలు.

సహృదయులు, రసజ్ఞులైన పాఠకులు 'భావవీణ'ను మీటి హృదయ రాగాలను పలికించుకొందురని ఆశిస్తున్నాను.

కలవకొలను సూర్యనారాయణ

# సాంత్వనము

బాలుడమాయకుండు మఱిభాగ్యవిహీనుడు తల్లిపాలనున్
గ్రోలగ నోచనట్టి చిఱు కూనడు నీదు కుమారుడెంతయో
జాలిగ నేడ్చుచున్ మిగుల సారెకు పాలిడు మంచుకోరినన్
జాలమనంబుక్రుంగె, గ్రహచారమునడ్డ తరంబెయేరికిన్.

"కలవారి ముద్దు సుతులకుఁ
బలె, కలుగునె ఫలము పేద బ్రతుకునకు సుతా!
విలపింపదగునె పాలకు
విలవిలనీగతి నితరుల వేడగ వెఱతున్.

కలుములులేని యభాగ్యుని
కిల జనియించిన యభాగ్యుకే విధిఁతెత్తున్
వలనుగ పాలను; రోదన
వలదు కుమార!" యని దీనవదనము తోడన్.

దారిద్ర్యంబును మించినట్టివ్యధ యీ ధాత్రిన్ మరేదిన్ కనం
గారావెచ్చటు, పూర్వజన్మముల నేకర్మంబు నేజేసితో
గారాబంబుగ పెంచనోపు కొమరున్ కష్టాలపాల్జేసి యిం
పారంగా గుడువంగసేయమికి నత్యంతమ్ముచింతిల్లెదన్"

బుజ్జగించిన క్షుద్బాధ పొంగిపొరల
బాలుడేడ్చును మానడు పాల కొఱకు
వీనినేగతి పోషింతు నేనటంచు
అంగలారుచునుంటివి ఆత్మలోన.

నేరిచి వేదశాస్త్రముల నిష్ఠగ, నేరిచి యస్త్రవిద్యలన్
భూరి తపోబలాన్వితు డపూర్వయశోనిధి యగ్నివేశుడన్
పేరుననున్న వానికడ పెల్లుగవాసి గడించినావు, నీ
నేరిచి నట్టివిద్యలిడునే కుడువంగ, ధనంబు లేనిచో!

ఎక్కడో పర్వతాగ్రమున నేకతముండి తదేక దీక్షతో
ముక్కును మూసి నిర్మల తపో విభవంబున నున్న భార్గవున్
పొక్కుచుపోయి బాష్పపరిపూరిత దృక్కుల నిల్చి దీనతన్
గ్రక్కున వేడితే ధనము కావలెనంచు ననేక రీతులన్.

తనకున్ గల్గిన రాజ్యసంపదలు విత్తంబెల్లత్యాగంబుతో
మునియౌ కశ్యపుడాది సద్ద్విజులకున్ మోదంబు సంధిల్లగా
మునుపెన్నండో యొసంగగా "కలవిటన్ బొల్పారు వస్త్రంబులున్
ఘన శస్త్రంబులు స్వీకరింపుమనఘా! కాంక్షించినన్ వీనినిన్.

అనినన్-ధనమడుగను జని
గొని వచ్చితివి బహుళంబు, కోరి శరములను
పనిగొని, ఊయవి నింపునె
కొనరగ కడుపును రవంత నోయాచార్యా!

చిన్నతనాన చేసితిమిస్నేహము విద్యల నభ్యసించుచున్
మున్నట నగ్నివేశకత పొందిక నుండి, వచించి తీవు "నీ
కెన్నడు సంపదల్ వలయు నేనొన గూర్చెద రమ్ము రాజనై
యున్నపు "డంచు" నేడు వలయున్ దయజూచి యనుగ్రహింపుమా"

అని యడిగిన, ద్రుపదుడు "నా
కును నీకున్ సఖ్యమెట్లు గూడున్ నీపే
రును సైతము వినియుండను
పనివడి వచ్చితె వెడలుము బాపడ!వేగన్.

బాపడవీవు పేదవు, నృపాలుడ నేను ధరాతలంబుకున్
తాపసిమూర్ఖుజేరి సుఖదంబగు సఖ్యముజేయనట్లుగా
భూపకులావతంసులకు భూసురకోటికి సఖ్యమెట్టులో?
నీపలుకుల్ వినంగనగునే? పరిహాసము చాలు పొమ్మికన్."

వాడిశరమ్ము వోలె నరపాలుని మాటలు గ్రుచ్చగుండియన్
తాడిత సర్పరాజము విధంబున మోమును పైకిలేపి, మా
టాడక లోదలంచె "సమయంబౌక నాటికి నాక్కు రాదొకో !
వీడిమదంబుడింతు"నని వీడె సభాస్థలి ద్రోణుడత్తరిన్.

నీపగ తీరుచోజొకటి నేటికి దైవము కూర్చె, శిష్యుడా
భూపకులోత్తమున్. విజయు, భూరి పరాక్రముగాంచి చెప్పినన్
నీపరితాప హేతువగు విక్కుడు కానిని పట్టి తెచ్చి సం
తాపము తీర్పుమాయని, యతండదిసేపిన తీరె నీవ్యథల్

# కుంతీ హృదయము

రాజిలు రత్నరాసుల పరంపర హాటక హారపాళి వి
భ్రాజిత మౌక్తిక స్థగిత భర్మరథావళి, కుంజరంబులున్
వాజుల సంఖ్య సంఖ్య, నులుపాయిడ ధర్మతనూజుకున్ మహో
రాజులు రాజసూయమున, రాజు సుయోధనుండగ్గెనీసునన్

ఖాండవమున్ దహించునెడ గ్రమ్మిన యగ్నిశిఖల్ చెలంగి, బ్ర
హ్మాండము నంతయున్ గుదిపె, నందు చరించు మయుండు భీతి నా
ఖండలు కార్మినందనుని గావగ వేడిన, గాచెవాని, నా
తండును ధర్మరాజునకు తద్దయునిచ్చె 'సభన్' కృతజ్ఞుడై

అమయ నిర్మితంబయిన హర్మ్యమపూర్వము, సాటిరావు సు
త్రాము యమాత్మ భూఃధనద రమ్య సభాస్థలులైననందు నా
రామ తటాక వాటికల రౌప్య సువర్ణ, విభూతి నొప్పు సౌ
ధామల శోభ జూచి కడు నార్రట మందె సుయోధనుండటన్.

హెచ్చిన యీసు దేహము దహింపగ పాండవ రాజ్యలక్ష్మినిన్
ప్రుచ్చిలె కౌరవాగ్రజుడు మోసపు జూదము నందు, వారినిన్
బుచ్చెవనాంతరంబులకు ప్రోద్బలుడై తన మేనమామచే
పచ్చని కాపురమ్ములను భస్మమొనర్చె నకారణమ్ముగా.

అజిన వల్కలములుదాల్చి, యమితలజ్జి
తులయి, పాండుకుమారులతులిత భక్తి
తోడ, ముకుళిత హస్తులై దుఃఖితయగు
తల్లిదీవనలందగ దలచి మ్రొక్క-

ధారుణి రాజపుంగవుల దర్పమడంచి మహాబలోద్ధతిన్
గోరున, సర్వభూపతులు భూరిధనంబులు తెచ్చియీయ, న
వ్వారిగ, రాజసూయమున భవ్యగుణంబుల మాన్యులై, సదా
చార పరాయణత్వమున శాంతముతో చరియించు వీరిటుల్

వంచితులైరి దుర్వ్యసన భావము పెంపున మాయజూదమం,
దంచితులయ్యు, సంపదల నన్నిటి యొడ్డి, యదేమి ఘోరమో
మంచికి మాఱుపేరయిన మాన్యుడు భీష్ముడు, ద్రోణుడేని వా
రించరు ధార్తరాష్ట్రి విపరీతపు జర్యల నెల్ల జూచియున్.

చేసిన మోసమున్ గని, వచింపక యుంటివి నీవు ద్వారకా
వాస ! భవత్పదాంబుజము బాయక గొల్తురు పాండవుల్, గత
త్రాస దురంత వృత్తికురు రాజులు చేసిరి దుండగంబులన్
నీ సఖులన్ దయామయుడ ! నెమ్మిని గావక యుంటపాడియే ?

కాంచన రత్నభూషణ నికాయము, ధౌతపటాలిదాల్చి, దీ
పించు సువర్ణపీఠమున వెల్గు యశస్వి మహేంద్రువోలె శో
భించెడి ధర్మనందనుని వేసము నిట్లు వ్యథాంతరంగనై
గాంచగలేను, కన్నమమకారము గుండెకు కోతలాయెడిన్.

ఏమితపంబు జేసెనొకో ? ఇమ్ముగ నిచ్చట పాండురాజు భా
ర్యామణి మాద్రిశక్తిమెయి, నాయమ చూడక నిప్డు మిమ్మిటుల్
తామృతి జెంది, చేరె సురధామము హాయిగ వీత దుఃఖయై
ఏ, మని, మందభాగ్యనయి, యీకొఱ నోముల పుట్టుపీడ్చెదన్.

భర్మ హర్మ్యముల వసించి, పట్టుపరుపు
లనిదురించి, ప్రసవవాటిక నడయాడి
మృష్ట భోజనము కుడిచి కష్టమన్న
తెలుగని కుమారులకిక పైనేమి యగునో ?

నాకొడుకుల్ మహాధ్వరమునన్ యశమంది, సుఖాను వర్తులై
లోకమునందు కీర్తిగని లోకుల నేలుచు నుండ వారిదౌ
ప్రాకట వైభవంబు గని పండెను నాదగు భాగ్యమంచు నే
వాకొనుదాన, కానియది వమ్మయె మూడు దినాల ముచ్చటై

ఓ సహదేవ ! నీవును మహోగ్రవనాంతర సీమ కేగెదే ?
భాసుర తేజులన్ గలసి, వల్కలముల్ ధరియించి, నీవిటన్
నా సముఖంబునన్ నిలువ, నాకగు నూరట చిత్తమందు, నా
యాసలు దీర్పుమయ్య ! సుతులందఱ జూచిన రీతి నుండెడిన్.

ఓ ధవళాక్షి ! ద్రోవది ! యయోనిజ ! నీదగు వర్తనంబునన్
యోధులు పాండవాన్వయుల నుజ్జ్వల కీర్తిపతాక కాంతి శో
భాధృతి నొప్పె, నాద్రుపదు వంశయశంబును వాసిగాంచె, నీ
నాథుల వెంటబోవ గహనంబుల, త్వత్కృత పుణ్యమెట్టిదో !

## విశ్వయోగి

విశ్వవిశాలమా మనసు, విశ్వజనంబులె బంధువర్గముల్
విశ్వహితంబె నీతలపు, వేదము లారయ నీదుమాట, స
ర్వేశ్వర రూపు మీ ముఖము, వేలుపుటొజ్జవు జ్ఞాన సంపదన్
విశ్వజనీనముల్ పనులు విశ్వస నీయులు విశ్వయోగులే !!

"విశ్వంజీ"యని పిలిచిన
విశ్వాసముతోడ, గల్గు పెక్కులు శుభముల్
విశ్వజనమ్ములు క్షేమం
బైశ్వర్యంబుల నెగడుటకై నీతపముల్.

చెప్పడు వేదసారములు, చెప్పడు ధర్మనిబద్ధ శాస్త్రముల్
జెప్పడు యజ్ఞయాగములు జేయుడటంచు, కఠోర దీక్షలన్
తప్పక యాచరించుడని, తద్దయు జీవులనెల్ల ప్రేమతో
చెప్పడు జూచుటొప్పునని యేర్పడ బోధలు సల్పునిత్యమున్.

మతముల సారమొక్కటియె మానవులార ! వినుండు, మూర్ఖులై
మతముల కారణమ్మున నమానుష వృత్తి జరింపరాదు, స
ఖ్యత సమభావనంబు మదిగల్గి సహోదర ప్రేమ పెంపునన్
సతతము ధర్మమార్గమున సంచరియింపుడటంచు పల్కెడిన్.

అల్లలనాడు నయ్యలకలు జూడగా
　　　ప్రభు యేసు యనెడి భావమ్ము కలుగు
పద్మాసనమున తపస్సమాధినినున్న
　　　దత్తదేవుడనెడి తలపుగలుగు
ధర్మ సూక్ష్మములు బోధన సల్పు సమయాన
　　　ఆదిశంకరులేమొ యనగదోచు
మత మౌఢ్యమును మాని మనుడంచు పలికిన
　　　మనసున సాయియే మసలుచుండు

సర్వభూతములయెడ హింస విడనాడి
కరుణజూపుడని పలుక గౌతమముని
యనెడు భావంబు మెదలును మనసునందు
వివిధ రూపాల వర్తిల్లు విశ్వయోగి.

తరుణ జ్యోతుల కాంతి కన్గవల, సత్సంకల్పముల్ డెందమం
దరయన్ వెన్నెల జల్లు చూపుల, నమందానందమామోమునన్
చిరునవ్వుల్ మధురాధరంబున, శుభాశీస్సుల్ శుభాకాంక్షలే
కురిపించున్ నిజభక్తపాళిపయి, ప్రార్థించ్చున్ హితం బెప్పుడున్

# నిరీక్షణావం

కొప్పును దువ్వి ముచ్చటగ కోకను కచ్చబిగించి కట్టి సొం
పొప్పగ కాటుకన్ కనుల నుంచి కుచంబులు దాచి పయ్యెదన్
చెప్పులు కాళ్ళకున్ దొడిగి చిన్నది, గంపను చేతబట్టి తా
జెప్పుచు గడ్డితెత్తునని చేనుకు పోయెను కౌతుకమ్మునన్.

మామకు మాట యిచ్చితిని మామయు తప్పకవచ్చుచేనికిన్
ప్రేమలు పెంచుకొందుమిక వెచ్చని కౌగిలిజేరి స్వేచ్ఛమై
మామక జన్మధన్యమగు, మారుని నిక్కునడంతు, వేగనా
స్వామిని గూడి, పొందెదను స్వర్గసుఖంబులు మామ పొందునన్.

సరిరారెవ్వరు మామకెందును, ప్రశంసా పాత్రుడౌవీడు నా
సరిజోడౌట మదీయ భాగ్యమగు, నీ సద్రూపు నేగూడి ని
త్యరసా స్వాదన చిత్తనై మురియుదున్, ధ్యానింతు నేనెప్డు, నీ
తరుణ శ్యామల సుందరాంగునకు పాదాక్రాంతనై యొప్పెదన్.

నొక్కుల జుట్టువాడు మదనున్ గెలువందగు నందగాడు వీ
డొక్కడె, కోరమీసముల నొప్పెడు గండరగండడుండు నా
పక్కన నెప్పుడుండునొ యపార సుధామధురైకమూర్తియై
అక్కున జేర్చుకొందును ప్రియమ్మున నాహృదయంబు రంజిలన్.

పచ్చని జొన్నచేల నెడబాయని జంటగ మేనులొక్కటై
ముచ్చట తీర్చుకొందునిక మోహనమూర్తిని గూడి, వానిగో
ర్వెచ్చని బాహుబంధమును వీడక, నిందలి చెట్టుచేమలే
యచ్చపు వేల్పుదీవనల నందగజేయును మాకు సాక్షులై.

ఎన్నిదివాల కోరికయొ ! ఈ తరుణంబున దీరుగాక, నా
కన్నెతనంబు, యౌవనము కానుక జేసెద నెమ్మినేడు, లే
కున్నఫలంబు నాబ్రతుకు నొందునె పల్లవ శాద్వలీస్థలుల్
పొన్నరి పాన్పులై దనరి పొందున కిచ్చుత స్వాగతంబులన్.

ఆకసమే పసందగు సమాశ్రయ మిచ్చును స్వేచ్ఛాప్రదిరై
మాకిట, పిల్లతెమ్మెరలు మంచి సుగంధము తెచ్చియిచ్చు, నీ
ర్మాకుల నున్న కోయిలలు మంజుల గీతము పాడుగాక, శో
భాకృతి నొప్పునీ ప్రకృతి యంతయు మాకు శుభమ్ము లిచ్చుతన్

చల్లదనంబుగల్గ, ననిశంబు ప్రియాపరిభోగ చిత్తలై
తల్లడమందు కాంతలకుతద్విరహాతుర తాపతీవ్రతన్
వెల్లుగ చందమామ వడిపెంచును, వెచ్చగనున్న మామ కౌ
గిళ్లను జేరి పొందెద నొగిన్ మెయి చల్లదనంబునెప్పుడున్.

గువ్వలు జంటజంటలుగ గూటికి జేరుచు నుండె రివ్వనన్
దవ్వుల నుండి యంబర పథంబున, గోగణముల్ కడున్ వడిన్
మువ్వలు సవ్వడింప తమ మోరలు చాచి గృహోన్ముఖంబుగా
చివ్వున పర్వులెత్తెడిని, సింధుర వర్ణము దోచెనింగి, లే
నవ్వుల మామ రాడిటకు నాదరిజేర, కతంబ దేమియో !

ముద్దుల మామ బొందుటకు ముందుగ వచ్చితి, వేచియుంటి నీ
పొద్దు, నిరీక్షణ వ్యథల పొన్పడ జొచ్చెను మేను, కన్నులున్
పెద్దగ జూచి చూచి కనిపించెడు నించుక నెట్టిగల్వలై
సద్దు మడంగె నీప్రకృతి, స్వాంతము స్వాస్థ్యము తప్పుచుండెడిన్.

కబురంపన్ కనరారు వేఱెవరు, నాకాత్రాదు పోవంగ నా
సొబగుల్, నాతలపుల్ వృథాయగునొకో ! శోకానలజ్వాలలో
నిబిడ ధ్వాంతమునందు నొక్కరితనై నేనేమి కావింతు నీ
యుబలాటంబును తీరదాయెనిక, నయ్యో ! దుర్విధిన్ దూఱుదున్.

కొమ్మలు రెమ్మలార, పసికొమ్మను నా త్రిని నున్నదాన; నన్
రమ్మని మామరాడిటకు, రమ్మని జెప్పరె ? మీరుగాని కా
కమ్మతొ నైనగాని, విరహమ్మునవేగితి, నూరకుంట మీ
కిమ్ముగ నున్నదంటె; వలదింతటి మౌనము, జాలిజూపరే ?

ఓయి సమీరుడా ! నిలువు మొక్క నిమేషము, నాకథన్ వ్యథన్
రోయక నాలకింపుము. మరల్ మదిరేపిన మామరాకకై
ప్రేయసి నొంటినుంటి, కనురెప్పలు వాల్పక జూచుచుంటియీ
ఛాయకు పొమ్మటంచు సరసమ్ముగ వానికి విన్నవింపుమా!

ఆకసమందు ప్రీతి ననయంచు చరించు పయోధరంబు లా
రా ! కరుణావలోకనములన్ గని యొక్క క్షణంబు నిల్చి
శోక దవానలచ్ఛటల సోలెను నీప్రియు రాలటంచు నీ
రాకకు వేచియున్నదని లాలన జేసి వచించి పంపరే ?

చెదరెను కంటికాటుక, కృశించె తనూలత వేచి వేచి సొం
పొదవెడు మోమువాడె, క్షణ మొక్క యుగంబుగ తోచుచుండె,
కుదుటుగ నుండ లేక మది కొందలమందె, నిరాశ పెంపునన్
యొదిగి ముడింగె చిన్నది వియోగ భరంబు భరింపలేనిదై

కలయికలో సుఖంబు క్షణ కాలము మాత్రమె యుండు కౌగిలిం
తలు మఱిచుంబనంబులును తర్కము జేయగ శాశ్వతంబులే ?
వెలకొను నిక్కమౌసుఖము నిత్య నిరీక్షణలో, తలంపులో;
జ్వలిత వియోగ బాధ కుపశాంతిని బొందెద నాతలంపునన్.

ఆతడు వచ్చియాశ యడుగంటె, మనః ఫలకంబుపైననే
నాతని మోహనా కృతిని నచ్చొనరించితి నిశ్చలంబుగా
భౌతికకాయ మడ్డెడని బాయని ప్రేమ నిరీక్షణ స్థితిన్
ప్రీతిగబొంద, గానమెయి వీడెద నిత్యసుఖాను భూతికై.

## అశ్రునివాళి

అరిన దొక్కదివ్వె జగమంతయు గ్రమ్మెను చిమ్మచీకటుల్
జేరె నభోంగణంబునకు జిమ్ముచు కాంతులు స్నిగ్ధతార, య
వ్వారిగ ప్రేమరాగములు పంచు దయామృత మాతృమూర్తి యౌ
"థేరస" కన్నుమూత నలుదిక్కుల వారికి శోకమయ్యెడిన్.

తల్లిని మించినావు, యిలదైవసమానవు నీవు, వెన్నెలౌ
చల్లని జూపులన్ దగిలి స్వస్థత బొందని మ్లానమానవుం
డెల్లడలన్ కనంబడునె? యీవసుధాస్థలి, నీకరాంబుజం
బల్లనసోకి నంత సకలార్త జనంబు సుఖంబు గాంచదే?

అప్పుడు గౌతముండు కలహంసకు గాయము మాన్పిప్రేమతో
చప్పట వీపుదువ్వి, యుపచారము జేసెనటంచు జెప్పగా
నెప్పుడొ వింటిమమ్మ! యిపుడీవు దయాగుణమొప్పదీనులన్
గొప్పగనాదుకొంట కనుగొంటిమి, గైకొను మానివాళులన్

ఇక్షురసమ్ముతో కలిపి యింత సుధారసమగ్గపాలుగా
వక్షమునందు నీజనని బాల్యమునందున పోసెనేమొకో!
భక్షణ జేసినావొ! యులుపాయిడ చక్కెర, వాక్కులందు, నీ
వీక్షణమందు తేనియలు వెల్వడు వెల్లువలై దయామయీ?

అంధుల కుష్ఠురోగుల భయార్తుల దీనుల కల్పకమ్మువై
బంధుర సేవసేయ; నినువారుస్తుతించిన విశ్వదైవమా
బంధము వృద్ధియైన తనవాసికి భంగము గల్గునంచు నీ
ర్ష్యాంధత పెంపునన్ మిగుల నల్గి హరించెను నిన్ను క్రూరుడై.

ధరణిపైగల మనుజుల కరమరికలు
లేని నిస్స్వార్థ సేవలు లెస్సజేసి
అలసిసొలసి పోయితివేమొ! అమరవరులు
సేవలందింతు రమ్మరో! శిరసువంచి.

## మౌనరాగము

ఎక్కడొ కొండకోన వసియించుచు నుందుము, భక్తిభావనన్
ముక్కునుమూసి యోగమున మున్గి తరించెడు తాపసుల్ బలెన్;
కక్కినకూడు కోరము తగన్ భుజియింతుము తృప్తిదీరగా
నక్కడ లభ్యమౌ జలము, నాకసమందలి సూర్యకాంతులున్.

ఆసలులేవు మాకు హృదయమ్మున నించుకయేని మీవలెన్
గ్రాసము కూడబెట్ట మతిగా గడియించి ధనంబు, గ్రోలిని
శ్వాసమునన్ జనించు కలుషంబగు వాయువు మేము, మాఱుగా
శ్వాసకు మీ కొసంగెదము సంతస మొప్పగ ప్రాణవాయువుల్.

చల్లదనంబు మీకిడి ప్రశాంతత గూర్తుము మండుటెండలో
పెల్లుగ మేముమాడి; కనువిందొనరింతుము చూచువారికిన్
బల్లవరమ్యశాఖల, సువాసనలన్ వెదజల్లు పూల పం
దిళ్ల, రుచిన్ శుచిన్ గలుగు దివ్యఫలంబుల, తేనె పట్టులన్.

మానవజాతి సల్పెడి యమానుష చర్యలజూచి జంతుసం
తానము భీతిజెంది తమ తావులు వీడి సమాశ్రయించు మా
స్థానము, ప్రేమతోడుత హృదంతరమందున స్థానమిచ్చి స
మ్మానము జేసి గాచెదము మాయయెలేని విశాలభావనన్.

నీలపయోద సంఘముల, నిండుమనంబున జెల్మిజేసి, బల్
లాలనమాటలాడి పరశంబగు వాక్కుల, వీచితల్లనౌ
గాలి, శిరంబువంచి, దెసగానని దూరపుయానమాపి, వ
ర్షాలను కుండపోతలుగ రక్కొన జేతుము మీ శుభంబుకై.

ఆతప వర్షశీతలము లన్నిటి కోర్చి సుగంధ పుష్పముల్
పూత మరంద మాధురినిబోలు ఫలంబులెగాక దేహమున్
సైతము జీల్చియిచ్చెదము స్వార్థమెఱుంగని సేవనెంచి సం
ప్రీతి, పరోపకారమును ప్రేముడిజూపుచు నిల్చినిచ్చలున్.

కన్నులవిందు గూర్చెదముకైకొని జూచు రసజ్ఞులందఱన్
మన్ననజేసి, సత్కవుల మంజుల కావ్యకళామతల్లికిన్
వన్నియగూర్చి పెట్టెదము వర్ణనకున్ దగు స్ఫూర్తినిచ్చి, మా
మన్నె పొలాలకుంగలుగ మంగళముల్ మధురానుభూతులున్.

ప్రేమరసైకమూర్తులగు పెద్దలు కొందఱు చిత్తశుద్ధితో
క్షేమముకోరి యెల్లరకు, శ్రీలు, శుభంబు లొసంగు మమ్ములన్
ప్రేముడినాటి మున్నెపుడొ పెంపువహింపగ జేసినారు, మీ
పామర జాతి నేడిటుల భగ్గున కూల్చుట పాడియౌనొకో ?

గొడ్డలివ్రేటులన్ దగిలి గొల్లున నేడ్చిన జాలిలేదు, హా
యెడ్డెతనంబు బోధపడె నిప్పుడు, మమ్ముల తొల్లి పెంచిరే
బిడ్డలవోలె, నేడిటుల భీకర రీతిని సంహరింప, మే
మడ్డుపడంగ జాలుదుమె? అంతటిక్రూరత యేల మాపయిన్ ?

మాటలురాని మూగలము, మాఱువచింపగ లేనివార, మె
చ్చోటకు పోనశక్తులము; శోకము మౌనముచే భరించి, క
న్నీటి కణాలు రాల్చి యవనిన్ బడ, ప్రాణము చెల్లిపోవు, మీ
ధాటికి హద్దులేదె? మమతల్ మదిలేవె? దయావిహీనులే ?

జీవితకాలమెల్ల వికసింతుము పచ్చదనంబుతోడ నె
త్తావులు గ్రుమ్మరించు వివిధంబగు పుష్పగుళుచ్ఛ సంతతుల్
చేవయు తీపియున్ గలుగు సిద్ధఫలంబుల నిచ్చి, యేలనో
పావకు వోలె నాశము కృపారహితంబుగ జేయ జెప్పరే?

## ప్రాభాతవేళ

పూర్వ దిశాచలంబుపయి పత్తడి కాంతులు చెన్ను మీరగన్
సర్వహితుండు సూర్యుడదె చారు కరమ్ములు చాపుచున్ సమ
స్తోర్విని మేలుకొల్పినను తోయజ నేత్రలు నిద్రలేవగా
నేర్వరు, ప్రాణనాథులను నిండు మనంబున కౌగిలించుచున్.

బాలభానుని నునువెచ్చ బంగరు కిర
ణాలు చెలియల చెక్కుటద్దాలు, సోర
ణములనుండి సోక కలవరమును జెంది
తెల్లవారెననుచు లేచి రెల్లవారు.

మంజుల నీరమందున సమంచిత చందనమింత చేర్చి య
భ్యంజనమాచరించి తడియారిచి వాల్జడలందు మల్లికా
మంజరులన్ ధరించియును, మంచిగకుంకుమ తీర్చి కన్నులం
దంజనరేఖదిద్దికొని యంగన లొప్పిరి దివ్యభామలై.

చేతికి గాజులన్ తొడిగి చెల్వగు చేలముగట్టి, మేనునన్
శీతల చందనం బలది, జేగురు కమ్మలుపెట్టి, పాదకం
జాతము లొప్పకింకిణుల, సన్నని కౌనునదాల్చి రమ్య సం
ఘాత విరాజమానమగు కాంచన కక్ష్యను భామలుండెడిన్.

మామిడితోరణంబులను మానుగ వాకిళులందు గట్టి, యే
మేమొ విచిత్ర చిత్రమగు మేలగు ముగ్గులు తీర్చిదిద్ద, శో
భామయమై వెలార్చెను నివాసము లన్నియు; భామలంతటన్
కామితసిద్ధినెంచి వరగౌరి వ్రతంబును జేయబూనెడిన్.

మండపమొండు, గేహమున మానుగ ప్రాగ్దిశనిల్పి రందునన్
నిండుగ కుంకుమన్ పసుపు నిమ్ముగ తీరిచి, పుష్పదామముల్
మెండుగ గ్రుచ్చికూర్చి రహిమించగ శోభిలు రీతి, నాపయిన్
కొండొక వెండి పళ్లెమున కోమలు లుంచిరి గంధమక్షతల్.

మండప మధ్యభాగమున మండిత కాంచనపాత్రనుంచి, నీ
రుండిన నారికేళ ఫల మొక్కటితెచ్చి హరిద్రకుంకుమల్
దండిగనద్ది, పాత్రపయి తత్ఫలముంచి నమస్కరించి పూ
దండలు చక్కజుట్టి ముదితల్ వెలిగించిరి జ్యోతిప్రీతిగన్.

పసుపుకుంకుమ గంధము పండ్లుపూలు
అక్షతలు ముద్దకప్పురం బమర దెచ్చి
సజ్జయందున సవరించి సంబరమున
మండపము ప్రోల వారు కూర్చుండిరంత.

మనసున గౌరి రూపమును మానక నిల్పితదేక దృష్టితో
కనుగవనుంచి దేవిపయి కామితసిద్ధిని గోర్చభక్తిమై
వొనరగ పూజసేయుచు ననూనముగా స్థిరచిత్తభావలై
వినయము మీర మ్రొక్కుచును వేడుచునుంటిరి కాంతలీగతిన్

"అమ్మ! భవాని! శోభనలరారెడు ముద్దులగుమ్మ! తమ్మనీ
విమ్మగ బ్రోవుమమ్మ! పరమేశ్వరురాణి! సుఖమ్ములిమ్మ; ని
త్యమ్ము మనోరథంబు ఘనతన్ నెరవేర్చుచు బ్రోవుమమ్మ! వే
దమ్ముల నెంచకమ్మరో! కరమ్ములు మోడ్చి ఘటింతు మంజలుల్

తల్లివి కల్పవల్లివి, మమతల్ సిరులిచ్చెడుసాలవెల్లి ! నీ
చల్లని చూపుతూపుల భృశంబుగ బాపవె దుష్కృతంబు మా
కుల్లసమొప్ప గూర్పగదె యొద్దియగా సుఖభోగభాగ్యముల్
పుల్ల సరోజనేత్ర! పరిపోషణసేయగరావె పెల్లుగన్.

శంకరి భక్తపాల హిమశైలసుతా, వరదా, శుభంకరీ,
సంకట నాశనీ, విమల సంయమి సన్నుత, విశ్వమాత, ప్రే
మాంకుర సుందరోజ్వల ముఖాంబుజ, మాకభయంబు నీవె హృ
త్పంకజమందు నిల్పెదము; ధ్వాంతము బాపి వెలుంగుజూపవే!

మంగళగౌరి! నీ మహిమ మాతరమే పొగడంగ, జేతులా
రంగ యొనర్చిపూజలు తిరంబుగ నిల్పుచు నీదుమూర్తి వే
భంగులవేడు కొంటిమి శుభంబుల నీయగదే. [illegible]
పొంగ కటాక్ష వీక్షణాలవంబొలికించవె లోకనాయకా!

నిన్నుభజించు వారలకు నిత్యశుభంబులు గూర్తువంట, మా
పన్నుల నాదరింతు వట పంతలు దీర్చి, ప్రసన్న దృష్టితో
సన్నుతిజేసినన్ తొలగు సంచితపాపము లన్నియుంట, మా
విన్నపమాలకించి శుభవీక్షణ పంక్తులు నిల్పుమమ్మరో

కమ్మని బూరెలున్ మినపగారెలు లడ్డులు పాలకోవ పా
రమ్మగు పాయసంబు రుచిరంబగు ఫేణులు చక్కిలంబులున్
గుమ్మన వాసనల్ కురియు కోరిన వంటకముల్, మరెన్నొ భ
క్ష్యమ్ములు చేసి దేవికిడి, కప్పురహారతులిచ్చి రంతటన్.

జాములు మూడుదాటెనిక జాలము సేయగ నేలరండి కాం
తామణులారవే! జనపదంబుననున్న సుమంగళాంగులన్
ప్రేముడి పేరటంబునకు బిల్వ, కురుల్ సవరించి మాలికా
స్తోమము చక్కదాల్చి కనసొంపగు చీరధరించిసాగు డీ!

కొందఱు పంకజాక్షులు దుకూలములన్ ధరియించి, రెందరో
సుందర భామినీ మణులు చొప్పడ గట్టిరి జిల్గు వెల్గులన్
చిందుపిశంగ చేలములు, చెల్వగు పచ్చని పట్టు చీరలన్
కొందఱు మందగామినులు కోరిక దీరగ దాల్చిరింపుగన్.

గాజులు ఘల్లుఘల్లుమన, కంఠమునందలి మౌక్తికావళీ
రాజిత రత్నహారముల రాపిడి సందడి జేయ, పాదపం
కేజ సుసంస్థితమ్మయిన కింకిణి విస్వనముల్ చెలంగ, నా
రేజవరాంగ్రుడు పేరటము లీలగ జేసిరి చూడముచ్చటన్.

# భగ్నమానస

కారణమేమిటమ్మ పసికందు బలెన్ విలపింపనీవు? క
న్నీరదె కన్నుదామరలు నిండి కపోలము నుండి జోరుగా
జారి ప్రవాహమై పొరలసాగె నిరంతరమున్, మనంబులో
హోరు జనింప వీచెడు మహోగ్ర విషాదపు గాలు లేమిటో?

మోమునువాడిపోయె, నవముగ్ధ మనోహరరూప సంపదల్
ధూమ పరాగకీర్ణమయి తోచెడు, గాత్రము శీర్ణమయ్యెనో
ప్రేమరసైకమూర్తి! కనిపించదు పూర్వపుకాంతి కన్నులం
దేమి కతంబు నీవగకు తేటగ పల్కవె భారతాంబరో!

నవరాగంబులు చిందు నీ హృదయ వీణాతంత్రులందేలనో
వివరంబొప్పగ జెప్పుమమ్మ! పలికెన్ విస్ఫార భీతంబులౌ
రవ సందోహములెన్నొ, నీ విటుల నిర్ప్రాణంబుగా నేలనుం
టివి, సంకోచము లేక పల్కు జననీ! డీలంగ నీవేలనో?

అన్నము నీరమున్ గొనవు నార్తి వహించి తపింతు వెప్పుడున్
మన్ననజేసి చూడరె యమానుషులై భవదీయ పుత్రు, లీ
విన్నదనమ్ము మున్నెపుడు విన్నది కన్నదికాదు; ఘూర్గవై
చిన్నతనమ్ముజెంది కడుసిగ్గున గూడలుక్రుంకి యుంటివే?

నీలాల ముంగురుల్ నిండె నీనుదుటిపై
సవరింపవేమమ్మ చక్కగాను ?
సింగార మొలకించు సిందూర తిలకమ్ము
ఘర్మాంబు రాశిచే కరిగెనేల ?
జలతారు చేలంబు జారగ సరిజేసి
కుచ్చెలున్ బాగుగా కూర్చవేల ?
సిగలోని పువ్వులు చెలువము కోల్పోయె
బొండు మల్లెలమాల ముడువ వేల ?

మొలకనవ్వులు మోమునం దొలకవేల ?
పాదపంకజమ్ములు తొట్రుపడునదేల ?
మాట రాదేమి నోటమోమాట మేల ?
మందమతివైతి వేమమ్మమంగళాంగి.

పరిపరి విధముల వేడిన
తరగని దుఃఖమునకున్ కతంబులనెల్లన్
భరత జనయిత్రి మనమం
దరమరలేక వచియించె నారాటముతోన్.

ఓ కరుణాంతరంగ ! మధురోజ్జ్వల మంజుల భాషణంబులన్
నాకొనరంగ పల్కితివి, నాకము నుండిట కొచ్చినావొ ? నా
వ్యాకులమెల్లదీర్చుటకు, వ్యర్థులు కారె మదీయ పుత్రి లో
లోకమునందు! వారి మదిలో కలదేయిసుమంత ప్రేమయున్.

నేపడుపాటులన్నియు గణించి వచింప తరంబె భూభరం
బేపుగ మోయు చుండెడి ఫణీంద్రునకైన మహాత్మ ! నాకిటుల్
దాపురమయ్యె కష్టములు దారుణమై మదిలో చెలంగు సం
తాపము తీరు రోజు దరిదాపున కానగరాదు కంటికిన్

గంపెడు కల్గిరుత్తములు ఖ్యాతిగడించిరి కొందఱందు నా
పెంపుకు గూర్చివన్నెలను, భీకర దాస్యపు శృంఖలమ్ములన్
త్రెంపి విదేశపాలకుల తేజమడంచి స్వరాజ్యలక్ష్మినిన్
సొంపుగ గూర్చిపెట్టిరి యశోధనులై యసమాన శూరులై.

కారాగారములందు క్రుమ్గిరి ధనాకాంక్షన్ ఫలాపేక్షయున్
దారాపుత్రుల నేనియున్ వదలి స్వార్థంబింత లేకుండగా
హోరాహోరి పరాయి పాలకులతో హుంకారముల్ జేయుచున్
పోరాటంబుమ సల్పి తెచ్చిరహా! నాపుత్రుల్ స్వరాజ్యంబునున్.

ప్రాణములొడ్డి తెచ్చిన స్వరాజ్యము నింపుగ తీర్చిదిద్ది రెం
తేనియతిన్ మహాత్ములు, గతించిరి రోజులు తీరివారు, నా
మానసమందు చిచ్చొదవి మాయని మచ్చమిగిల్చి, నెట్టుతో
ప్రాణము చిక్కబట్టితిని బాయని దుఃఖము నాపి గుండెలో.

చేసిన పుణ్యమంతయును చెల్లయి పోయినదేమొ ? యింకనా
వాసి గతించె, నేడు దురవస్థల పాలయిపోతి, వా సుతుల్
జేసెడు దుష్ట కార్యములు సిగ్గును బాధను కల్గజేయుచున్
గోసిన కోతలై మదినిక్రుంగగ జేయుచునుండె పెల్లుగన్.

మంచికి కట్టినారిట సమాధి, నమానుషకార్యశూరులై
మించిన స్వార్థమెల్ల విషమించగ, పుణ్యము పాపమేదియో
యించుకయైనగూడ మదినెంచక దుష్కర దుష్టభావనల్
సంచితమయ్యె వారికి, నిశాచరులై విహరించు చుండెడిన్,

నీతిని గంగలో కలిపి నేమము తప్పివచించి, మోసపుం
జేతల గద్దె నెక్కిరి; త్యజించి సత్యము ధర్మనిష్ఠ, దు
ర్నీతిని పెంపుజేసి విపరీత ధనార్జన వారిగమ్యమై
భీతిని, జంకుకొంకులను వీడి చరించుచు నుండి రీగతిన్.

పట్టము గట్టినారు నరపాలురు నేడవి నీతి కాంతకున్
కట్టడ దప్పిపోయి, యధికార మదాంధపు గారు జీకటుల్
దట్టములై పెనంగొన యదార్థము కన్నుల గాంచలేరు, చీ
కొట్టు సమస్త భూ ప్రజలు గొంతు వహింపరు రోషహీనులై.

పదవీకాంక్షలు హద్దుమీర దురితవ్యాపార దీక్షారతిన్
వదలన్ జాలరు భద్రపీఠమును, సేవాధర్మమ్మున్ వీడి స్వా
భ్యుదయంబే తమ జీవితాశయముగా భోగంబులన్ దేలుచున్
మదిలో గాంచరు పేదవారి మొఱలేమాత్రంబు దుర్మార్గులై.

తేనియ జాలువాఱుకడు తీయని మాటలు చక్కబల్కి యా
హైనయ వంచనా నిరతి బంగరు గద్దె నలంకరించి స
న్మానములందు కొంచు నణుమాత్రము నెంచరు; నీతిదూరులై,
మానవసేవ సల్ప దయమానిన స్వార్థపు బుద్ధి పెంపునన్.

న్యాయపథంబు నుం దొలగమంచు నయంబగు మాటలాడుచున్
నాయకులైనవారు కుహనామతులై చరియించి యెంతో య
న్యాయ పథంబునందె పయనంబును జేయుచు దేశసంపదల్
హాయిగ మెక్కికూళలయి హైన్యము గూర్చిరి నాదువాసికిన్.

ధనదాహంబు పిశాచమై పెనగొనన్ దాక్షిణ్య హీనాత్ములై
యనఘాఘంబులు, మంచి చెడ్డలును, న్యాయాన్యాయ భేదంబులన్
కనులంగాంచరు, నులన్ వినరు, వక్రాలోచనాభావులై
తినరేవారలు కమ్మగా తృణము తప్తిన్ బొందియెంతో మదిన్.

నా సిరులెల్ల కొల్లగొని నాశముజేసిరి నాదుకల్మి, వి
శ్వాస విహీనులై ప్రసవవాసిత సుందర వృక్షవాటికో
ద్భాసిత రమ్యసీమల కృపారహితంబుగ కూల్చినారు, నే
జేసిన కర్మమో, కుటిల జహ్ముల మోసమొ! ఏమి చెప్పుదున్.

మోసపు గార్యమున్ సలిపిప్రముక్కడులై ధనమున్ గడించిబల్
గాసిలి, రమ్యహర్మ్యముల గట్టి సుఖంబుల తేలియాడుచున్
మాసరమైనగాని, యణుమాత్ర నివేశమునైన లేక, మై
మాసిన మ్లానమానవుల మాట దలంపరు స్వార్థబుద్ధులై.

శాంతియు, నైకమత్యము, ప్రశాంతత, ప్రేముడికాలవాలమై
పొంతమునన్ నిరంతరము పొంగెడు పల్లియలందు నేడు దీ
ర్ఘాంతిని గొల్పు కక్షలతో కట్టడ దప్పియశాంతి నిండె, సి
ద్ధాంతములేని నాయకుల తక్కరి చేష్టల కారణమ్మునన్.

ఆకలి బాధకున్ పిడికెడన్నము, దాహము దీర్ప నీరమున్
కోకలు మానరక్షణకు కొంచెము లేని యనాథులుండ పా
ప్యాకలితాంత రంగులయి కమ్మని విందులు మద్యపానమున్
వీకగ్రహించి పొంగెదరు; వింతగతోచెడు వారి చేష్టలున్.

పల్లెలె దేశసంపదకు పట్టుడు గొమ్మలటంచు రైతులే
వల్లభు లీధరిత్రికని, భావికి వారల కాయకష్టముల్
చల్లని రక్షయైబరగు సర్వజనాళికియంచు బల్కికో
కొల్లలు మాయమాటలను, కోఅడపాలొనరింతు రాపయిన్.

హింస, యసత్యభాషణలు, హేయపు మారణకాండ సల్పి వి
ధ్వంసపు కార్యలోలురయి ధర్మ వివేచన మాని క్రూరతన్
కంసుని మించినారు, దయగానని దుష్టనికాయముల్ నరూ
త్తంసుల, సాధు సత్తములతల్లడ బెట్టుచు పెక్కుభంగులన్

ఎంచ తరంబె నాయిడుమ లెంతటి వారలకైన చెప్పినన్
పంచు కొనంగ జాలుదురె ? పండెను పాపఫలమ్ము ధాత్రిపై
ముంచుకు రాక పోవునె సమూల వినాశనమౌ దినమ్ము లీ
వంచక రాక్షసాధముల? భావి తరంబు సుఖింపకుండునే ?

శాంతి వహింపు మమ్మ! ఘనశాపము నీయకుమమ్మ, నీమనం
బెంతగ క్రుంగి పోయి దురపిల్లుచునున్నదొ గాంచినాము, నీ
సంతతి నావరించి మను స్వార్థ పిశాచము, దుష్టభావనం
బంతముగాదె? పూర్వపు ప్రభల్ విరజమ్మవె వాపి కూర్చుమన్.

# సంక్రాంతి

ఆతప తాపముల్ తొలగె, హ్రస్వములయ్యె నహమ్ములున్, హిమో
త్పాతము తీవ్రమయ్యె, భువిపై చలిగాలులు హెచ్చె, నైన, శ్రీ
ప్రాతము, కోడికూయగనె వైశమలేచి, గృహాంగణమ్ములన్
శీతల వారిజల్లి, శుచిజేసిరి ముగ్గులువెట్టి చక్కగన్.

రంగుల రంగవల్లులు సరాగమునన్ పువుబోండ్లుదిద్ది, వే
భంగుల తీర్చిదిద్ది, వసివాడక తెచ్చిన ముద్దబంతులన్
మంగళమైన గొబ్బిళుల, మానుగ కుంకుమమున్ హరిద్రమున్
సంగమొనర్చి చల్లిరట, స్వాగతమిచ్చుచు పౌష్యలక్ష్మికిన్.

'హరిలొరంగా హరి' యనుపాడు హరిదాసు
పాట వీధుల ప్రతిధ్వనుల వీన
ధనలక్ష్మియందెల ధ్వనితోడ గృహములు
మంగళప్రదములై చెంగలింప
అత్తవారిండ్లతో క్రొత్తదంపతులు స
రస భాషణముల పారణము సేయ
గంగిరెద్దులవారు గడపచెంగట నిల్చి
సన్నాయి శోలుల సందడింప

బొమ్మలకొలువు జేసెడి కొమ్మలెల్ల
సలుపు పేరటంబుల జోరు పులకరింప
వచ్చె సంక్రాంతి పండుగ, తెచ్చె నుత్త
రాయణము, పుణ్యకాలము, ప్రాభవముగ.

నెలవంక నెదిరించు నెమ్మోము పైపండు
మిరపల తిలకంబు సరిగదిద్ది
ఘనకేశ పాశంబు కనువిందుగాజుట్టి
చేమంతిపువ్వుల చెండువెట్టి
రంగురంగుల శుభ రంగవల్లుల జిగి
నలరారు చేలంబు నమరగట్టి
కమనీయ కంబుకంఠమున బంగరు సిరి
ముద్దబంతులదండ పొసగదాల్చి

మంచుపొరల తెరలు దాటి అంచితముగ
భోగిమంటలఁజలిదీర్చి వేగముగను
కదలివచ్చెను సంక్రాంతి కనకలక్ష్మి
జనపదంబులఁబురముల జనులఁబ్రోవ

## భావవీచిక

ఓ నవయౌవనాంగి! మధురోజ్జ్వల మంజులభాషిణీ! సుధా
గాన కళామయీ! విమలకాంచన సన్నిభ! చారుశీల! చం
ద్రానన! నవ్యచూత రుచిరాధర! లేతగులాబిలేమ! నా
ప్రాణమ! మానసాంబుజముపై వసియింపగరమ్ము కోమలీ!!

చెప్పితి వెన్నొముచ్చటలు చెంతకువచ్చి, రసానుభూతితో
ముప్పిరిగొన్న నామనసు మున్గెనుప్రేమ సుధార్ణవంబులో;
తెప్పవు నీవయై మెలగి తీరము జేర్చిహృదంతరమ్ములో
చొప్పడ దాచుకోగదవె శక్కను బాపుచు కౌగిలింతలన్.

వాకిట నిల్చియోరగను వాల్జడనల్లుచు, వాలుచూపులన్
నాకను దోయిలో నిలిపి నావవి సూటిగనాటె, నంతలో
మైకముగ్రమ్మి సోలితిని; మై తెలివొంది మఱొక్కసారి నీ
యాకృతి జూతమన్న మఱుగైతివి చూపులకెంతొ దూరమై.

నీమృదులాంక సీమపయి నెమ్మిశిరంబిడ, నాయెడందలో
ప్రేమరసైక భావనలు ప్రేరణసేసె, సుఖానుభూతికై
మామక బాహుబంధమున మక్కువ బందిని సేయబోవగా
వేమి కతంబొ నేనెఱుగ! నేగితి వెచ్చటికో క్షణబులో.

తరుణీ ! నీ యధరామృతంబునిక నిత్యంబున్ మదిన్ గోరెదన్,
దరహాసంబయి వెల్గమోముపయి, గన్పట్టంగ సింధూరమై
గరిమన్ రాజిల రత్నహారమయి నీకంఠంబునన్, శ్వాసయై
బరగన్ గుండియలోవసింప, కనరావా ! నాపయిన్ కోపమా ?

నెత్తావుల్ విరజిమ్ము సుందర వనిన్ నిన్ మున్ను వీక్షించి, నా
చిత్తంబందున పాదుకొల్పితి, శుభశ్రీలొల్కు నీరూపము
నృత్తుంగా నొనరించె, నీ దయినయందం బెల్ల నోలేమ ! నీ
హొత్తున్ గోరెద జేరరమ్మ దరికిన్ హోకార్ప తాపాగ్నులన్.

## సౌమిత్రి

ఎందఱుల్లేరు తమ్ములు మహీతల మందున వేనవేలుగా
వందిత రామచంద్రునకు భ్రాత సుమిత్రవరాల పంట. యా
యిందునిభాస్య, చారు తరళేక్షణ, యూర్మిళ హృత్సరోరుహం
బిందిరమైన లక్ష్మణుని దీటగు వారెవరీ వసుంధరన్ ?

అన్నను, తండ్రి, దైవము, ప్రియంబగు నేస్తము, నొజ్జ, సర్వ సం
పన్నిచయంబుగా దలచి, పావన సచ్చరితంబు, రూపమం
దన్నులమిన్న నీదు వదినమ్మను తల్లిగ నెంచినావు. నీ
కెన్నగ స్వర్గధామము మఱేదియు లేదని నిల్చినావహా !

కమ్మని జవ్వనమ్మడవి గాచిన వెన్నెల జేసి స్వర్గతు
ల్యమ్మగు రాజభోగముల నన్నితృణంబుగ వీడి భ్రాతృపా
దమ్ముల సేవనమ్మె సుఖదంబగు భాగ్యమటంచు నెంచు నీ
నమ్మకమెంత కమ్మనిది ! నమ్మిన నీకె సుబోధకంబగున్.

లేత యనంటి మొవ్వయన, లీల వెలుంగు మెఱుంగు దీవనా
శ్వేత మరాళ మై ఖరిని, విచ్చిన కన్నెగులాబి వోలె, సం
ప్రీతిని నల్వకోరి కనువిందుగ మల్చిన దివ్యరూప సం
జాతను సాధ్వి యూర్మిళను చ్ఛయ్యన వీడితి వెంతస్థైర్యమో !

మంగళ వాద్యనాదముల, మానిత వేదపురోహితోత్తముల్
ఖంగున పల్కు మంత్రముల కమ్రరవంబులు వీనుదోయిలో
రింగున మాఱు మ్రోగుటలు లేశము మాయకమున్నె, యౌర ! నీ
యంగన వీడి రామునకు నండగ నేగితి వెంత త్యాగమో !

పట్టు వస్త్రాల జిలుగులు, పాదయుగళి
పైన నెలకొన్న పారాణి, మేనిగంధ
సంభరిత పరిమళముల సారమైన
వాడకయె వెడలితి వీవు వీడు వీడి.

అన్ననరణ్య సీమలకు నంపుట తత్ శుభలగ్నమందు తా
కన్నకుమారుడే ప్రభువు కావలె నీమహికంచుకైక వా
కొన్న తెలుంగు విన్నపుడు క్రుద్ధుడవై బహుకర్కశంబుగా
క్రన్నన పల్కుటద్ది రఘురామునిపైగల ప్రేమ చాటెడిన్.

కత్తులు దూసి "చంపుదునుకైక"నటంచు రుషారుణేక్షణో
న్మత్తపు సింగమట్లు గరిమన్ దుముకంగ, రఘూద్వహుండు, పై
కెత్తిన చేయిడించి, యుఱుకెత్తిన కోపదవాగ్నినార్పి, ని
న్నత్తఱి శాంతుజేసెనట, హా! తమదెంతటి ప్రేమ తత్త్వమో!

అంకితమయ్యె నీదు మన మన్నకు సేవలు సేయుటందు, నే
వంకకు పోవ నేరదు లవంబును, తద్విరహానలంబునన్
సంకట మంది బాష్పముల జాఱ్చుచు మాఱు వచింప లేక యే
ఱంకుచునున్న నీసతికి శాంతిని గూర్పవదేమి చిత్రమో!

తల్లియె దైవమన్నయల ధర్మమెఱుంగవె నీవు లక్ష్మణా?
చెల్లియొ, చెల్లకోయనిన చెన్నటి మంధర మాటజేసి, నీ
తల్లి సమానురాలు పిన తల్లి వనాలకు రాము నంపగన్
వెల్లునె దూఱ నామె నటు, చేతము వాసెనె నీయధీనమున్?

ముందఱ రాఘవుండుచన, బ్రోల సవిత్రి సమాన సీత, యా
సుందర కాననమ్ముల విశుద్ధగతిన్ జరియింప, వారికిన్
గ్రందుగ కందమూలములు, కమ్ర కుశమ్ములతోడ శయ్య, నా
నందముగా నమర్చెదవు, నమ్మిన బంటువటన్న నీవయే.

అన్నయును, వదినయు, నెంతొ యాదమఱచి
పర్ణశాలను సుఖముగా పవ్వళింప
నిదుర నెఱుగక నీవు నిర్ణిద్ర మతిని
వారలను కొల్చి నాడ వపారభక్తి.

ఇంతలు సేవసేసిన ననేక విధంబుల భక్తి శ్రద్ధలన్
సుంత సుఖం బెఱుంగకయు, సూనృత వృత్తిని తత్పదంబుల
శ్రాంతము మ్రొక్కుచున్, వినగరానివి, గుండియ వ్రయ్యు పల్కులో
యింతి వచింప నెట్లు సహియించితొ ? యెంతగ దుఃఖమందితో !

నీపద పంకజమ్ములనె నెమ్మి భజింతు నిరంతరంబు, నే
పాపము నేనెఱుంగ, పొరపాటుననైన శిరంబు నెత్తి, నా
జూపుల నెన్నడున్నిలిపి చూచి యెఱుంగను మీముఖంబు, న
న్నీపరుషోక్తులాడ కతమేమని పల్కవు గాడె లక్ష్మణా !

# దశరధ నిర్యాణము

పురినయోధ్యను దశరధ భూవిభుండు
సూర్యవంశ సంజాతుండు శూరవరుడు
ధర్మనిష్ఠాగరిష్ఠుడై, తండ్రివోలె
ప్రజల నేలుచు నుండెను ప్రజ్ఞమీర.

పెద్దరాణియా కౌసల్య వినుతశీల
చిన్నరాణి సుమిత్ర సుస్నిగ్ధ చరిత
కార్యసాధనలో దిట్టకైక, కాని
రాజునకు ప్రీతి మూడవరాణియన్న.

యజ్ఞమొక్కటి జేయగా నాయయోధ్య
విభుడు, కల్గిరి పుత్రులు విమల మతులు
రామభద్రుండు కౌసల్య నోము పంట
భరతుడను వాడు కైకేయి వరసుతుండు.

లక్ష్మణాఖ్యుడు సర్వ సులక్షణుండు
శుభకరుండు శత్రుఘ్నుడు సుందరుండు
సచ్చరిత్ర సుమిత్ర ప్రశాంతమూర్తి
గర్భవాసాన జనియించి ఖ్యాతి గనిరి.

సంతు గలుగ దశరథుని చింతదొలగె
కొఱతయన్నది లేకుండ వరలుచుండె
కాలమొకరీతి గడచునేఘనులకైన
చిక్కులెదురయ్యె రాజుకు చింతగలుగ.

ఒక్క శుభలగ్నమందు రాజొప్పిదముగ
రామ పట్టాభిషేకంబు రహిని పలుప
నిశ్చయించిన విషయంబు నిక్కమెఱిగి
కినుక వహియించె రాణికైకేయి మిగుల.

ముద్దుల సతికి కోపంబు పెద్ద గలుగ
పతి, దశరథుండు వేంచేసె కతము దెలియ
గోరి, కోపాగ్ని పోకార్చ కోప గృహము,
విన్నవించెను రాణికి విషయ మెల్ల.

వినినకైకేయి బుస్సు బుస్సని కుబుసము
విడిచిన మహోరగముపోలె వేగలేచి
కనుల నిప్పులు రాలంగ కసిగ జూచి
రాజుతో పల్కెనిటుల మర్యాదవీడి.

"మున్ను నాకొసగిన వరములవి రెండు
గుఱుతు లేదెరాజ ? యిపుడు కోరెదనవి
భరతు పట్టాభిషేకంబు బరపు టొకటి;
రామునంపుట కానన సీమకొకటి."

అనుచు ఖండితముగ బల్కనట్లు కైక
గాలివానకు పడిన వృక్షంబు పగిది
వాడియమ్ములు గ్రుచ్చిన పక్షివోలె
సొమ్మసిలి రాజు నేలపై సోలిపోయె.

పిదప తెలివొంది దుఃఖంబు యెదను పొంగ
"ఓసి కఠినాత్మురాల ! పయోముఖ విష
కుంభమా ! నయవంచకి ! కోరినిన్ను
మిగుల ప్రేమించి నందుకా మిడుకు టిటుల.

కలిసి కాపురమును జేసి మెలగినాము
తెలిసికొన లేక పోయితి తెలివిమాలి
మేడి పండువు నీవని, మేకరూపు
దాల్చిన పులినోట నిడితి తలను నేను

పై మెఱుగులను జూచి నీపైన ప్రేమ
పెంచుకొంటి, కాచమణి వీవంచు నేడు
తెలియవచ్చె, కఱకు రాయివలె నేడంద
మాఱిపోయిన దేలనే మందబుద్ధి !

నాడు సంగ్రామ సమయాన నాకొనరగ
సేవలందించియుంటచే చిత్తమలరి
రెండు వరములనిచ్చితి, గుండెవ్రయ్య
వాని కోరినా విప్పుడు వంత కలుగ.

ప్రేగు తెంచుక కన్నట్టి ప్రేమ ముందు
పెంచిన మమకారమ్మునె త్రెంచివైచి
అడుగ రానట్టి కోర్కెల నడిగినావు
అంత దయమాలి, యింత యత్యాశ తగునె ?

రామచంద్రుని విడిచి నేబ్రతుకలేను
అవరమునకు మాఱుగ నన్యమొకటి
కోరుకొనరాదె, ముదుసలి కోర్కెదీర్చి
దయను జూపవె నాపైన తలిరుబోడి.

రామచంద్రునిపై గల్గు ప్రేమవలన
పురజనులు వార్లు దీరిరి పురమువీడి
వారితోడ వనములకు బరగనేగ
నీవు భరతుండు రాజ్యంబు నేలుకొనుడు.

అనుచు బ్రతిమాలినను, కైక మనసుమాఱ
దాయె, పట్టువిడువదాయె, అవని విభుని
యాన తలదాల్చి రాముడు కానకేగె
మనుజ పతియును స్వర్గధామమునకేగె.

## విరహిణి

చక్కని వారిలో మిగుల చక్కని దానవు దేవకాంతలన్
తక్కిన సుందరాంగనల దర్పమడంచగజాలు రూపమున్
నిక్కుకుచంబులున్ విపులనీల సుకేశభరమ్ముతో, భళీ !
పెక్కు వచింపనేల వినువీధి వెలుంగు మెఱుంగు దీవవే,

వీణియ జేతపట్టియర విచ్చిన కన్నుల విభ్రమంబుతో
గాన కళావిదగ్ధవయి కమ్రరవంబులు పల్క మీటుచున్
మానవపుంగవున్ ప్రవరు మన్మథ సన్నిభుజూచి, వానినే
మానసమందు నిల్పితివి, బ్రాన్పడి చేతలుడింగి యట్టులే.

జాణతనంబుజూపి పెలుచన్ పలుచేతల మాటలందు, సం
ధానక్రియాముఖున్ సలుప ధర్మములన్ తలక్రిందు జేసి, వి
జ్ఞాన ధురీణ నాబరగఁ జక్కగ బల్కిన. బాపడున్ స్వధ
ర్మాను రతుండు గాన వినడాయెను నీవ్యథ సుంత యేనియున్.

రమ్ము వేరమ్మని రమణి ! నీవు వచింప
వలదని యాతడు తొలగిపోవ
వాలు జూపుల దూపు వనజాక్షి ! నీవిడ
పెడమోము నాతడు పెట్టియుండె
కరముల్ల్ జాపియు, కౌగలింపగబూన
బాపడు పాపము పరుగులెత్తె
ఆశ్లేష మొనరించి యధరమ్ము నాశింప
హరిని స్మరించి భూసురుడు తొలగె

క్రతువులవియెల్ల చేయుట కడకు, మాదు
కౌగిళుల సుఖము కొఱకుకాదె ! యనగ
జన్మరాహిత్యమౌ మోక్ష సాధనమున
కవియె సోపానముల్ జుమా అనియె నతడు.

ఓ కమలాయ తాక్షి ! విరహోగ్రత దీనముఖార విందవై
శోక దవానలచ్ఛటల స్రుక్కి తనూలత వాడిపోవ, మీ
నాకృతి నొప్పు కన్గవ నవారుణమయ్యె, రుషాపరాభవ
వ్యాకులతాతి రేకమున స్వాస్థ్యము తప్పెమనంబు నీకటన్.

"తనువా బంగరు కాంతులీను, ముఖమాత్రైలోక్యసమ్మోహనం
బనజెల్లున్, సిగబారెడున్ గలిగి భృంగాళిన్ విడంబించు, నా
కనులా ఫుల్ల సరోజముల్, భళిర ! యాకొనున్న దోలేదా ? కనుం
గొనరా దట్టి మనోజ్ఞు పొందనిచో నేకోల్పోదు ప్రాణంబులున్".

అంతటి యందగాని భువనాతి మనోహర దివ్యమూర్తి, నే
కాంతమునందు జూచి, మదిరాక్షులు మోజున మోహమంది, ది
గ్భ్రాంతిని బొంది, వానిదగు కౌగిలిఁ జేరకయుండ నేర్తురే !
వంతలఁ జిక్కిపోరె? సురభామినులై నరమింప గోరుచున్.

చుక్కల లోన చంద్రుడు చూడగ ముచ్చటలాయె, నాడుకై
పెక్కిన కన్నుదామరల నింపుగ నిల్వగ వానిరూపమే
చిక్కెమదీయ హృత్కమలసీమ, ననంగు డదేమొ యెంతయున్
టక్కరి యౌచు నాయెడ గడంగె నలంచగ పూవుటమ్ములన్.

అనవ మన్మధు నంకము జేరని
 దేహంబు దేహమే ? తిత్తిగాక
ఆ విప్రవరు నధరామృత మానని
 పెదవులు పెదవులే ? పొదలు గాక
ఆ ధరామరు కనులార వీక్షింపని
 కన్నులు కన్నులే ? గనులుగాక
ఆ భూసురోత్తము ననురాగ మబ్బని
 జన్మంబు జన్మమే ? జడముగాక

అతని కౌగిలి లేకున్న బ్రతుకు లేదు
అతని చరణ సన్నిధిలేక ఆర్తిగొనుదు
అతనిరమియింపకున్న నే నంగజు శర
వర్షమున మున్గి ప్రాణంబు వదలు దాన

అనివిరహంబునన్ చని మృగాక్షిరో ! యాతడు పోవు మార్గమం దున, హిమవన్నగావృత సుదూర వనాంతర భూములందు చ య్యన, మఱిగాన కాతని రయంబున నేగి నిజాశ్రమంబు, నీ మనమున నిల్పి భూసురుని మన్మథ రూపము శోకమూర్తివై.

విరహ బాధల వేగు తరుణుల పసివడి
వేధింతువే చంద్ర వెలుపులేక ?
అబలలపైబడి యస్త్రంబు సంధింప
తగునయ్య మన్మథ తలపవేమి ?
గంధవాహ ! తగునా కామ తప్పులనిట్లు
మలయ మారుతముల మ్రగ్గసేయ ?
చెలులార ! యనునయ సేవలు సేయుచు
నన్నిటులుడిగింప న్యాయమగునె ?"

అని వరూధిని నిందించు హద్దులేని
మదన తాపంబు మనసును కుదిపివేయ
ననుచితోచితముల నరయంగగలరె
కామరోగ పీడితలైన కాంతలెందు ?

## వీర నీరాజనము

భారతమాత నేత్రముల వర్షపు ధారలవోలె బాష్పముల్
ఘోరున కారుచున్నయవి, ముష్కరులైన తురుష్కపాలకుల్
భూరిభుజప్రతాపమున బొంగుచు దారుణ దండయాత్రగా
చోరులవోలె చేయుటలుచూచి, సహింతువె భారతీయుడా ?

తరతమ భేదముల్ మఱచి ధైర్యగుణంబున నందఱొక్కటై
గురుతరమైన కార్యమున, కొండలపైని నపారదీక్షతో
నరమరలేక శాత్రవుల నంతము జేసెడి సైనికాళికిన్
తిరమగు నండదండలను తెల్పెడి ధైర్యముకల్గ వారికిన్

భారతదేశ రక్షణయె బాధ్యతగా మదినెంచి రేబవల్
పోరుచు నన్నపానములు పోనిడి శాత్రవ గూల్చుటొక్కటే
కోరు "జవాను" సోదరులకున్ దృఢచిత్తము సత్త్వమిచ్చి య
వ్వారిగ, నిమ్ము దీవనల. వారలు గెల్వగ భారతాంబికా !

కదనముగోరి సంతతము కాలునుద్రువ్వుచు నంతరాత్మలో
వదలరు వైరభావమును, వాస్తవమిద్ది, నటింత్రు స్నేహమున్,
విదితము నేడు వారిదగు వింత ప్రవర్తన, మంచి మాట లిం
పొదవునె మూర్ఖచిత్తులకు, నొక్కతుపాకియె మందువారికిన్

అకాశంబును తాకు కొండగమిపై నత్యంత ధైర్యంబుతో
రాకాసుల్ బలెనొప్పు శాత్రవులతో రక్తంబు చిందన్ భళీ !
సాకారంబగు రుద్రలోయన నొడల్ ఝుల్ఝుల్లనన్ మంచులో
వీకన్ పోరు సిపాయిలార ! కొనుడీ వేవేలు జోహారులన్



# కవి



పేరు ;

జననం ;

విద్య ;

ఉద్యోగం ; జిల్లా పంచాయితీ ఆఫీసు
పనిచేసి పదవీ విరమణ చేశ

అభిరుచి ; ఇంగ్లీషు వార్తాపత్రికలలో
కవిత్వం

ముద్రిత రచనలు ; 1) సాయినాధ సుధా
3) శ్రీనివాస కళ్యాణ

అముద్రితము ; సత్యసందర్శనం (శతకవ



# కవి పరిచయము

పేరు ; కలవకొలను సూర్యనారాయణ

జననం ; 16-10-35

విద్య ; బి. ఎ.,

ఉద్యోగం ; జిల్లా పంచాయితీ ఆఫీసులో సూపరింటెండెంటుగా పనిచేసి పదవీ విరమణ చేశారు.

అభిరుచి ; ఇంగ్లీషు వార్తాపత్రికలలో 'Letters' వ్రాయడం కవిత్వం

ముద్రిత రచనలు ; 1) సాయినాధ సుధామాధురి 2) సీత 3) శ్రీనివాస కళ్యాణము 4) భావవీణ

అముద్రితము ; సత్యసందర్శనం (శతకము)